[illegible] శ్రీరామ

శ్రీ

# శ్రీరామరామశతకము

[illegible]

గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా సంతగుడిపాటి
పురనివాసులగు [illegible] సత్పుత్రుండగు
వెంకటప్పలరాజ విరచితము.

శ్రీశ్రీశ్రీ గంగుల నారాయణశాస్త్రిగారిచే పరిష్కృతము.

శ్రీయుత ఆలపాటి లక్ష్మయ్య చౌదరిగారి దత్తపుత్రుడగు
రామకోటయ్య చౌదరిగారి ద్రవ్యసహాయముచే

నరసరావుపేట రాజ్యలక్ష్మీ ముద్రాక్షరశాల యందు
ముద్రింపబడియె.

500 ప్రతులు

1934

[ వెల 0-5-0.

## ఒక్క మాట



శ్రీ ఆర్యమిత్రమండలిసభాహ్వానాధ్యక్షమా! మిత్రమ!

మీరుబంపిన శ్రీరామరామశతకమనుగ్రంథమును జూచితి

గీ॥ పలుకుపలుకున భక్తియే ♦ పరిఢవిల్లె
రామరామనుశబ్దంబు ♦ రాజనమ్యొ
చంద్రసూర్యులు నుండిరి ♦ జతగనచట
భావమందున వైరాగ్య ♦ భావమమ్యొ॥

8—3—34
న॥ తా॥
లింగంగుంట్ల.

ఇట్లు
గంగుల నారాయణరెడ్డి

# తొలిపలుకు

———:o:———

ఉ॥ సుందరమైనశబ్దములు ♦ శోభిల సర్వజనాళి మెచ్చయా
నందముజెంద పండితులు ♦ నౌరయటంచనిపల్కుచుండగా
పొందుగ రామరామశత ♦ పూర్తముజేసితి తోకచిచ్చుసం
క్రిందనభోగ భట్టకుల ♦ రాట్కవిశేఖర రామచంద్రుడిం
పొందుగబ్రోచునిన్ను ♦బుధపూజితయప్పలరాజమిత్రుడా॥

బెల్లంకొండవారిపాలెం,
పల్నాడుతాలూకా.

ఇట్లుబుధజనవిధేయుడు,
**కూరపాటికోటంరాజకవి**
23—2—34

# మనవి.

ఓ నాపరమాత్మస్వరూపులగు సోదరులారా

సుహృదయులారా!

ఈ శ్రీరామరామశతకమును వ్రాయునంతటిబుద్ధి నాయందేమాత్రమును లేదని నే వ్రాయనేల? మీకువిశదము అయ్యలారా! ఒకనాటిరేయి అర్ధరాత్రివేళ నిద్రించుచున్న నన్నెవరో లేపినట్లు నిష్కళంకముగా లేవ యేరూపంబే సంకల్పంబే స్వప్నమును మదికిదోచక మద్గృహంబుననుండు శ్రీరామమందిరంబు ప్రవేశించి(యదాయదాహిధర్మస్యగ్లానిర్భవతిభారత)అనుగీతసరణిభక్తసంరక్షణార్థమై అయోధ్యానగరంబునదశరధకౌసల్యల గర్భంబునందవతరించిన శ్రీరామప్రభుని క్షణకాలంబుస్మరించి నొకపద్యమునువ్రాసి చదువుకొని ఆనందంబొందితి. అటుమీద ఆదయామయుడగు జానకీనాధుకృపచేగలిగిన సంకల్పంబాపలేక నిరువదైదుపద్దెంబులవ్రాసి అస్మదాత్మ కత్యంతప్రియులగు మద్గురూత్తములతో సమానులగు శ్రీయుత గంగుల నారాయణరెడ్డిగారికి యీపద్దెములువినుపింప వారతిముదంబున శతమును పూర్తిజేయుమని ప్రేమభావముచే వాక్రుచ్చె. నావల శతకమును పూర్తిజేసితి. అంత శ్రీఆర్యమిత్రమండలిసంఘసభ్యుడగు శ్రీయుత ఆలపాటి రామకోటయ్యచౌదరిగారు యీసభ నాహ్వానింపవెళ్ళినతరి యీపద్యములజదువ వారత్యంతప్రేమచే అచ్చొత్తింపుటకై నామోదింప యీశతకమును భక్తప్రియుని కరుణచేవ్రాసినను వ్రాయుటనేనే (అహంకారవిమూఢాత్మా కర్తాహమితిమన్యతే)అనుగీతాసరణి వ్రాసితిగాన వ్రాయునంతటిశక్తి లేమిచే అన్నియుపునరుక్తములే. అన్నియు యతిప్రాసములకు దూరములే. అనగా నార్షునివచనములరీతి వ్రాసినదే వ్రాసితి. అందు శా

ప్రరీతి విచారించిన బాలుని సంజల్పంబులయ్యె. అంత శ్రీ ఆర్య
మిత్ర మండలి సంఘాధ్యక్షులును అఖిలభూదపయులును సదా ప
రమాత్మధ్యానపరులును, భూతదయకుమించినపున్నెంబు లేదని
అనుభవముచేయు శ్రీ సద్రూపస్తుని చరిత్ర హరికథగాను అహిం
సావ్రత పరమమార్గములనిరూపింపు గురుశిష్య సంవాదమను
పద్యకావ్యంబును యీకనుబడుదృశ్యంబంత మిథ్య కేవల పర
మాత్మయే సత్యంబనునట్టి వట్టిమాయశతకంబును. భక్తియే సర్వ
మునకు శ్రేయస్కరంబు, భక్తిలేనితనువు మృతకళేబరంబని జెప్పు
భక్తాగ్రేసరుడగు ప్రహ్లాదచరిత్ర నాటకరూపముగాను. సత్యమే
నిత్యంబని ప్రకటించు సత్యహరిశ్చంద్రీయనటులే. శ్రీ రామాయ
ణము పాటగాను. సగుణనిర్గుణసంబంధమగు కీర్తనతత్వము లు
ఇదివరకే దేశమునకు దెలియజేసిన శ్రీ గంగుల నారాయణరె
డ్డిగారు ఇందలిలోపముల క్షీరంబునగలయు నీరునిడదీయు
బాలమరాళంబుపగిది పవిత్రజేసినందులకు వారికెంతయో నా
కృతజ్ఞతాభివందనములు.

ఈగ్రంథమును అహోతుకభక్తిచే లోకోపకారము
నకై ప్రకటింపజేసిన శ్రీయుత ఆలపాటి రామకోటయ్యచౌ
దరిగారికిని వారికుటుంబమునకెంతయో కృతజ్ఞుడ.

ఇట్టిప్రేమమిత్రులును గురు జననీ జనకసోదరుల ఇది
యదియననేల సర్వంబున్ జతజేసి సంపూర్ణమగు జ్ఞానంబుని
చ్చిన కరుణామయుండగు సర్వాత్మునకనేక శిరస్సాష్టాంగ నమ
స్కారములు —

ఇట్లు,
తోకచిచ్చు వెంకటప్పలరాజు
ది 10—3—34

## సీసమాలిక

—:○:—

శ్రీలలనే ప్రొద్దు ♦ నోలలాడుచు కల్మి
లారూఢి జిల్లగుం ♦ టూరుజిల్ల
ఆజిల్లయందున ♦ రాజిల్లెనే పెద
కాకాని పుడమి స్వ ♦ ర్గపురమాని
ఆ పేటనే ప్రొద్దు ♦ భావింపకాపురం
బుండూరు సంతతా ♦ నందయతులు
బ్రహ్మక్షత్రియ వైశ్య ♦ పాదోద్భవులు సత్య
వ్రతదానశీలన ♦ ద్యాంశముఖులు
వారిలో కమ్మసువి ♦ చారప్రసిద్ధులు
కమ్మ వైభముగ్నుతి ♦ కమ్మవారు
ఆ కమ్మవారియందు ♦ దతికీర్తిచే మించి
ప్రఖ్యగాంచిరి ఆల ♦ పాటివారు
ఆ వంశశేఖరుం ♦ డై యొప్పె రామయ్య
కవిసురకల్పవృ ♦ క్షంబనంగ
రామయ్యకాంతయై ♦ రాజిల్లె లక్ష్మిదే
వమ్మ స్త్రీలలాపూల ♦ కొమ్మయనగ
తద్గర్భరత్నముల్ ♦ దనరిరి నాగయ్య
లక్ష్మయ్య బుధజన ♦ రక్షకుండు
నాగయ్యకిల్లాలు ♦ నయమొప్ప ఆదెమ్మ
జ్ఞాననిధియని ♦ ఘనతగాంచె

పవనభుగ్భూషణు ♦ పార్వతీరమణుండు
మల్లేశ్వరాలయు ♦ మందహాసపుడు
వైవాహికము జేసి ♦ భవవిదూరుండైన
శివపూజనరతిభక్త ♦ దనరునొక్క
పేరుగాంచిన పుణ్యుఁడు ♦ పెరుగింపు జేసిరి
శృంగారాగారాలు ♦ పొంకమైన
పెద్దతుతూరాలు ♦ పేరైనతాషాలు
రమణస్సన్నాబోతు ♦ లమితముగను
నొక్కపెట్టునమోగిన ♦ పెక్కువాద్యమువిని
భువిదాల్చుకరులకు ♦ చెవుడుబారియా
పెళ్లిదిమ్మలుమోడి ♦ కట్లతుపాకీలు
బొజార్లు నెగడి ♦ పదిపిల్ల
అవిరిదీపంబు ♦ లాశ్చర్యముగ రాత్రి
వేళభాస్కరుచుబ్బ ♦ వించినట్లు
యీరీతివైభవం ♦ బెసగంగఁ జేసిరి
వైవాహికంబు బల్ ♦ వాంఛతోడ
యిట్టిపుణ్యులకునిం ♦ పొసగంగ కృతి జేసి
పరికింపగా నొక్క ♦ భట్టుమూర్తి
ముదమందు శ్రీబైట ♦ ముంజులూరుగ్రామ
వాసుండు సత్కవి ♦ వర్ణితుండు
రహిమించు వెంకట ♦ రమణరాజాత్మజుం
డప్పలరాజుమే ♦ నల్లుడైన



౹ ౧ శ్రీ రా ను

# శ్రీ రామ రామ శతకము.

శ్రీగణపతి స్తోత్రము



సీ॥ శ్రీగణేశ్వరనిన్ను ♦ సేవింతు సేవింతు
భజియింతు పితరుల ♦ పాదమాన
సకల విద్యలయందు ♦ సంపూర్ణమయుడవు
నీదయఁజూపుమో ♦ నిర్మలాత్మ
కార్యసిద్ధిని జేయ ♦ కరుణామయుండవు
పరము మార్గముజూప ♦ ప్రభుడవీవు
శ్రీరామ నామంబు ♦ చింతించి బ్రహ్మచే
ప్రథమ పూజ్యతగొన్న ♦ పావనుడవు
గీ॥ పార్వతీశ్వరు ముద్దుల ♦ పట్టివీవు
నీదుకరుణయు నాపైన ♦ నిల్పుమయ్యా
అయ్యనేవ్రాయు శతకంబు ♦ యక్షరముల
తప్పులనుజూచి దిద్దియు ♦ చెప్పుమయ్యా॥

     

ఓం శ్రీ రామ

# శ్రీ రామ రామ శతకము.

శ్రీగణపతి స్తోత్రము



సీ॥ శ్రీగణేశ్వరనిన్ను ♦ సేవింతు సేవింతు
భజియింతు పితరుల ♦ పాదమూన
సకల విద్యలయందు ♦ సంపూర్ణమయుడవు
నీదయర్ జూపుమో ♦ నిర్మలాత్మ
కార్యసిద్ధినిజేయ ♦ కరుణామయుండవు
పరము మార్గముజూప ♦ ప్రభుడవీవు
శ్రీరామ నామంబు ♦ చింతించి బ్రహ్మచే
ప్రథమ పూజ్యతగొన్న ♦ పావనుడవు
గీ॥ పార్వతీశ్వరు ముద్దుల ♦ పట్టివీవు
నీదుకరుణయు నాపైన ♦ నిల్పుమయ్య
అయ్యసేవ్రాయు శతకంబు ♦ యక్షరముల
తప్పులనుజూచి దిద్దియు ♦ చెప్పుమయ్య॥

—♦ ఆంజనేయుని స్తుతి ♦—

సీ॥ శ్రీరాము కార్యంబు ♦ సిద్ధిగాఁ జేసిన
వరయాంజనేయు నిఁ ♦ బ్రస్తుతింతు
శ్రీరామ మంత్రంబు ♦ చిత్తంబులోనిల్పు
వరయాంజనేయు నిఁ ♦ బ్రస్తుతింతు
శ్రీరాముకరుణచే ♦ స్థిర పదార్థముగన్న
వరయాంజనేయు నిఁ ♦ బ్రస్తుతింతు
శ్రీరాముపదసేవ ♦ స్థిరభక్తితోఁ జేయు
వరయాంజనేయునిన్ ♦ బ్రస్తుతింతు
గీ॥ అంజనీదేవి వరపుత్ర ♦ యార్యమిత్ర
నిన్ను నమ్మితి నన్నేలు ♦ నిక్కమిపుడు
సంతగుడిపాటి పురమందు ♦ సత్యవంత
బుధజనానంద విజ్ఞాన ♦ పూర్ణచంద్ర॥ 2
సీ॥ శ్రీరామ పరమాత్ము ♦ సేవించి మున్నుండు
సత్యమార్గముగన్న ♦ జనకులార
మగనికి సేవలు ♦ మరువక సేయుచు
దైవంబుగా నెంచు ♦ తల్లులార
సర్వజీవులయందు ♦ సమబుద్ధి జూపుచు
క్షమముతో నుండెడు ♦ సాధులార
పరమ పావనమైన ♦ పరతత్త్వమార్గంబు
చెప్పిచూపెడి మహా ♦ సిద్ధులార
గీ॥ చదువనొక పద్దెమైనను ♦ సరిగరాదు
జానకీనాథు కృతినివ్వ ♦ బూనినాఁడ
రహిని శతకము పేరు శ్రీ ♦ రామరామ
శతకమంచని చెప్పితి ♦ సుతుడ నండి॥ 3

సీ॥ శ్రీరామ నిన్నదా ♦ చిత్తమందున గొల్వ
దుఃఖంబులుండునా ♦ దురితహరణ
శ్రీరామ నీకథ ♦ సింగారముగ విన్న
మరల జన్మముయెత్త ♦ మరుపుగలదె
శ్రీరామ నీభక్త ♦ చెలిమి జేసినయెడ
ఘోర గుణమ్ములు ♦ కూలిపోవె
శ్రీరామ నీపద ♦ సేవజేసినయెడ
తనకు గేమిగలదింక ♦ ధరణియందు
గీ॥ రామ శ్రీరామయని నిన్ను ♦ రాత్రి బవలు
ధ్యాన్నమొనరించు భక్తుల ♦ దరికి జేర్చు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ! 4

సీ॥ శ్రీరామనీపాద సేవజే ♦ సెదగాని
మాయ సంసారంబు ♦ మాన్పవయ్య
శ్రీరామనీనామ ♦ చింతయేమారను
పాపాత్ములతో పొందు ♦ నాపుమయ్య
శ్రీరామ నీవంశ ♦ చారిత్రమునెదను
కలియుగంబులోనన్ను ♦ గావుమయ్య
శ్రీరామ నీవేమి ♦ జెప్పిన జేసెద
పరీక్ష తోడుగనిల్చి ♦ బలుకవయ్య
గీ॥ నీదు దర్శనభాగ్యంబు ♦ నివ్వుమయ్య
పేదవాడను నామీద ♦ బిగువటయ్య
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ! 5

సీ॥ యేమహామహులిచే ♦ నీ సర్వజగమంత
పుట్టిపోవుచునుండు ♦ పూర్తిగాను
యెవ్వనిపాదంబు ♦ నిల నల్లరాతిని
భామగాజేసెను ♦ పారజూడ
యేమహాత్మునిముద్ర ♦ లేపొద్దు దప్పక
సద్భక్తితోగొల్చి ♦ సంతసింతు
యేదేవు సుచరిత్రి ♦ మేవేళలంజెప్పు
పరమేశ్వరుడుచెప్పు ♦ పార్వతికిని
గీ॥ యట్టిపరమాత్మునిఖిలాత్మ ♦ నంతరాత్మ
నీవెయనుచనిచాటితి ♦ నిజముగాను
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంబోధిసోమ శ్రీ ♦ రామరామ 6

సీ॥ దశరథాత్మజరామ ♦ దయగల్గిజూడుమా
నీదాసదాసుండ ♦ నేడురామ
పశుపతినుతనామ ♦ బంగారుశ్రీరామ
పరమపావననామ ♦ భవ్యరామ
ధర్మదేవతరామ ♦ దానవాంతకరామ
కారుణ్యగుణధామ ♦ కమలరామ
ఆశ్రయించితిరామ ♦ యానందసుశ్యామ
వరములివ్వరరామ ♦ భవవిరామ
గీ॥ పరమకళ్యాణరామనా ♦ భాగ్యరామ
వరమునీంద్రులరామనం ♦ దరకురామ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంబోధిసోమశ్రీ ♦ రామరామ 7

సీ॥ మానసంబున నిన్ను ♦ మరువక ధ్యానింతు
మమకారములనెల్ల ♦ మఱగఁ జేయు
వాక్కున నీనామ ♦ వాసిగఁ బల్కెద
వంకర గుణముల ♦ వదలఁ జేయు
కాయంబు నీదందు ♦ కష్టముల్ వచ్చిన
సంతసంబును నాకు ♦ సరిగఁ జేయు
కరముల చేనిన్ను ♦ కడుభక్తిఁ బూజింతు
పరమ సజ్జనగోష్ఠి ♦ బరగఁ జేయు
గీ॥ నీదయాధర్మమనుటని ♦ నిక్కముగను
నాదు మొరవినిగావరా ♦ న్యాయమైన
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 8

సీ॥ కరిని గాచినరామ ♦ కనుగొంటి నినురామ
పంతమేలర రామ ♦ భక్తప్రేమ
ద్రౌపది హితనామ ♦ ధరణిజకునురామ
పశుల కాపరిరామ ♦ ప్రణుతనామ
బ్రహ్మాది నుతరామ ♦ పరమ సద్గుణసీమ
కరుణగాంచినరామ ♦ కదనభీమ
దీనరక్షకరామ ♦ దితి సుతహతరామ
దివ్య సుందరరామ ♦ ధీరరామ॥
గీ॥ కావుకావుము దయదో శ్రీ ♦ కార్యరామ
రమ్మురమ్మింక తడువేల ♦ రామరామ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 9

సీ॥ నీభక్తుఁడనురార ♦ నిన్నె నమ్మితిరార
పాలించరావేర ♦ పాపదూర
నీపాల బడినార ♦ నిరతంబు నేలరా
నిరుపమాకారనా ♦ నేరమేర
నాపాలి దారరాత ♦ సనుదయా గనవేర
భక్తజనానంద ♦ పాపమేర
ఎంచనుంటివిరార ♦ యేమంటివినురార
మందడనా గావ ♦ మరువరార
గీ॥ అనుదినంబున దలచితి ♦ దనుజహర
నన్ను రక్షించకున్నను ♦ నిన్ను విడర
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమశ్రీ ♦ రామరామ॥ 10

సీ॥ శ్రీరామచంద్ర నీ ♦ చిన్ని పాదంబుల
దరిశనమివ్వరా ♦ దయనుగాంచి
నీలమేఘశ్యామ ♦ నిర్దయజూపకు
పాలించ నీవంటి ♦ ప్రభుడవంటి
దాశరథే యన్న ♦ ధర్మంబుదప్పక
కాచి రక్షించెటి ♦ ఘనుడవంటి
దీన రక్షణమును ♦ బూని యున్నావని
చాల నమ్మితినయ్య ♦ సంతరించు
గీ॥ ఫేసరితినింక నేవెడ ♦ వేరుబోక
పచ్చ్యుతరక్షణముసబ్రోవు ♦ వందనంబు
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 11

సీ॥ సీతామనోహరా ♦ చింతలు దీర్చరా
నీపూజాపరా ♦ నిర్విచార
నీనామ భజనమ్ము ♦ నిత్యంబునుకావను
నగరాజ సమధీర నమ్మినార
యెన్నెన్ని విధముల ♦ యెంతవేడినగాక
పారవారగభీర ♦ పంకెమేర
నినుమర్వకున్నార ♦ నీవాడనే రార
నీదాసుడను నేను ♦ నిజము రార
గీ॥ పరమ మునిమానస విహార ♦ ప్రాపుగార
నిరుపమాకార కరుణతో ♦ నేలుకోర
సంత గుడిపాటిపుర ధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 12

సీ॥ నిన్నెనమ్మితినయ్య ♦ నీసేవవిడనయ్య
నన్ను బ్రోవవటయ్య ♦ నల్లనయ్య
దాపుచేరితినయ్య ♦ దయగనరావయ్య
జాగేలనోయయ్య ♦ చక్కనయ్య
శబరి నేలితివయ్య ♦ చపలుని నేనయ్య
దశగలరామయ్య ♦ కుశలులయ్య
నాస్వామినీవయ్య ♦ నగుబాటుగాదయ్య
తప్పులెంచకుమయ్య ♦ ధర్మమయ్య
గీ॥ ఇంతకాలంబు జరిగెనే ♦ పంతమయ్య
సుంతదయరాకయున్నదే ♦ చూడుమయ్య
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 13

సీ॥ జనకరాజకుమారి ♦ జన్మంబె జన్మంబు
భగవంతు చేతను ♦ భర్తయయ్యె
దశరథ కౌసల్య ♦ దాంపత్యమేయొప్పు
భగవంతు దవారి ♦ బాలుడయ్యె
జానకిన్గన్నట్టి ♦ జనకుడే జనకుడు
భగవంతుడల్లుడై ♦ ప్రభలుటయ్యె
పరమాత్మ్మసేవించు ♦ పావనిదేజన్మ
భగవంతుదెప్పుడు ♦ బలుకుటయ్యె
గీ॥ నిన్ను గొనియాడువారల ♦ నిల్పుటయ్యె
నన్ను రమ్మనవేలనో ♦ న్యాయమయ్యె
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 14

సీ॥ వీనులున్నందుకు ♦ వినిరె శ్రీహరికథ
పృథుచక్రవర్తికి ప్రియముసహాహా
నయనంబులున్నట్టి ♦ నయమునుచెకొన్న
యర్జునుయానంద ♦ మందముహాహా
దేహంబుగల్గిన ♦ దివ్యసుఖంబందె
భూపుత్రిజేసిన ♦ పుణ్యమహహా
హస్తమ్ములున్నట్టి ♦ హాయినిగనుగొన్న
పవనునందనుడెంతో ♦ భాగ్యమహాహా
గీ॥ ఇంతకును నిన్నుసేవించు ♦ టిలనునహాహా
చింతదీర్చవదేలనో ♦ చివరకహాహా
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 15

సీ॥ శ్రీరామునకు పూజ ♦ జేసిన చేతులు
శ్రీరామ రామన్న ♦ జవ్వజవ్వ
శ్రీరాము నిలువెల్ల ♦ చూచిన చూపులు
శ్రీరాముపదముల ♦ శిరము శిరము
శ్రీరాము గొల్చిన ♦ చిత్తంబు చిత్తంబు
శ్రీరాము కథవిను ♦ చెవులు చెవులు
శ్రీరాము దారినే ♦ కోరినపదములు
శ్రీరామ దాసుల ♦ చెలిమి చెలిమి
గీ॥ దీనరక్షకయన్నదే ♦ దినముదినము
సతము నీభజనజరుప ♦ చదువు చదువు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంబోధిసోమశ్రీ ♦ రామరామ 16

సీ॥ నాకర్మమేమయ్యా ♦ నీకన్నదైవమే
లేడంచు వేడినా ♦ లేచిరావు
నానేరమేమయ్యా ♦ నినువిడనాడితే
నిర్దయుండవుగావ ♦ నియతివిడకు
దీనబంధువుగావా ♦ దిక్కుజూడగరావా
పరమపాలనకీవా ♦ ప్రభువుగావా
సాధురక్షణశీల ♦ సన్నుతగుణజాల
పంతమదేలరా ♦ భక్తపాల
గీ॥ యేల నేజేయుదోషముల్ ♦ యెంచమేర
ఈలుగల్గినవచ్చిన ♦ స్నేలుకోర
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 17

సీ॥ శ్రీరామనీసేవ ♦ జేయుచుండెడివారి
సాంగత్యమిప్పించి ♦ సరిగజేయు
శ్రీరామనీరూపు ♦ నాకూర్మిజూచెడు
భక్తసన్నిధిలోన ♦ బంపివేయు
శ్రీరామనీనామ ♦ శ్రేష్ఠంబువల్కెడు
సిద్ధులలోననన్ను ♦ చిక్కజేయు
శ్రీరామనీకథల్ ♦ నోరూరజెప్పెడి
పౌరాణికులయొద్ద ♦ జేరవేయు
గీ॥ దురిత సంకల్పములఁద్రుంచి ♦ తూలవేయు
కలికిగుణములనన్నిటి ♦ కాలరాయు
సంతగుడిపాటి పురిధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 18
సీ॥ శ్రీరామప్రభువరా ♦ చెప్పెదవినుమురా
నీమోముజూడరా ♦ నిర్వికార
కరినిగాచినధీర ♦ కమలాక్షుడనినార
కనులకగుపడవేర ♦ కష్టమూర
శబరిరక్షణలేర ♦ జయజయరఘువీర
కన్నతండ్రివిరార ♦ నన్నుజేర
భక్తకోటినిజేర్చి ♦ పాలించమంటిరా
భయముపెట్టెదవేర ♦ భయవిదూర
గీ॥ నామనంబున నెంతోనిన్ ♦ నమ్మినార
సారెసారెకుదిప్పకు ♦ నూరకేర
సంతగుడిపాటి పురధాము ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 19

సీ॥ పరమాత్మనీప్రేమ ♦ పాటింపతరమానె
శరణుజొచ్చిన ♦ విభీషణునినేల
పరమాత్మనీప్రేమ ♦ పాటింపతరమానె
కోతిగుంపులనిండ ♦ కోతినావు
పరమాత్మనీప్రేమ ♦ పాటింపతరమానె
కోయబోయులజూడ ♦ కోయినావు
పరమాత్మనీప్రేమ ♦ పాటింపతరమానె
వనమృగంబులునెల్ల ♦ వచ్చిచూడ
గీ॥ అహహానీప్రేమదనుసాటి ♦ నరయగలమె
కోటిరూపాయలైనను ♦ పాటిరావు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ। 20

సీ॥ కులమెక్కువనిమాది ♦ కులికేరుప్రజలంత
గుహుడుయేకులమందు ♦ గుణుడునయ్యె
బలమున్నదనిమాకు ♦ ప్రిభలుచుదిరిగేరు
యుద్ధకేబలముండి ♦ యొప్పెభువిని
పురుషులమనిమేము ♦ పొందుగాజెప్పేరు
శబరియేపురుషత్వ ♦ జయముగాంచె
నరజన్మమేమంచి ♦ మరిజన్మమున్నను
యేనుగుయేజన్మ ♦ మెత్తెచూడు
గీ॥ నియతితోనిన్నుధ్యానించ ♦ నిపుణజన్మ
అంతకంటెనుమెక్కువే ♦ మగుపడదిక
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 21

సీ॥ సాకేతపురధామ ♦ సజ్జనావనసీమ
సకలసద్గుణకామ ♦ సమరభీమ
మునులబ్రోచినరామ ♦ మురహరశ్రీరఘురామ
దారిజూపరరామ ♦ దయతోరామ
ప్రహ్లాదవరరామ ♦ పాలితశ్రీరామ
పతితపావననామ ♦ హితవురామ
గరుడవాహనరామ ♦ కలుషసంహారరామ
కరుణగాంచుమురామ ♦ దొరవురామ
గీ॥ తాటకినిజంపియాగంబు ♦ ధరణిరామ
సాగుజేయించినట్టికో ♦ సల్యరామ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 22

సీ॥ నీదయయేనాకు ♦ నిజమైనభాగ్యంబు
నీదయకన్నను ♦ యేదిసుఖము
నీదయలేకున్న ♦ నేజేయునదిలేదు
నీదయదప్పిన ♦ లేదుసుఖము
నీదయజూపించు ♦ నిత్యంబుసుఖమివ్వ
నీరూపమేనాకు ♦ నిత్యసుఖము
నీచరిత్రముజదివ ♦ నేజెప్పుచుండెద
నీకథల్వినెదను ♦ నాకుసుఖము
గీ॥ నీభజనదప్పకుండిన ♦ నియతిసుఖము
నిన్నుగాంచనివారికి ♦ సున్నసుఖము
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమశ్రీ ♦ రామరామ॥ 23

సీ॥ శ్రీరామ పరమాత్మ ♦ చింతలు దీర్చరా
రావణసంహారా ♦ రారబ్రోవ
మోహనాకారనీ ♦ ముద్దుమాటలు నాకు
బాగుగా జెప్పరా ♦ బ్రతుకునేనుపు
నీకృపామహిమనుంచి ♦ నిత్యంబు నేలరా
బాపుము సంసార ♦ బాధములను
నీకటాక్షము గన్న ♦ పాకారిసుఖమొందె
నీకటాక్షము లేక ♦ నీగ్రసురు
గీ॥ తెల్ల శ్రీరామ శ్రీరామ ♦ కల్లగాదు
యుల్లమున నమ్మితి ♦ కొల్లగాను
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 24

సీ॥ శ్రీరామ నీనామ ♦ క్షేమంబు చెప్పెద
మాయసంసారంబు ♦ మరుపుమయ్యా
శ్రీరామ నీనామ ♦ సారంబు చెల్పెద
దుఃఖత్రయమ్ములు ♦ ద్రుంచుమయ్యా
శ్రీరామ నీనామ ♦ చింత నేమరువను
క్రోధాదిశత్రుల ♦ గూల్చుమయ్యా
శ్రీరామ నీనామ ♦ స్థిరమును బల్కెద
గుణములమూటేసి ♦ నణగద్రొక్కు-
గీ॥ పరమముని పాలనాపాలి ♦ భ్రాంతిద్రుంచు
శరణు జేసెద ధరణిలో ♦ శాంతినుంచు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 25

సీ॥ ఓనాథనీకథల్ ♦ ఒప్పుగావినువారి
జన్మంబెజన్మంబు ♦ జగతిలోన
ఓనాథనీనామ ♦ మొప్పుగాభజియించు
వారిదిపుణ్యంబు ♦ వసుధలోన
ఓనాథనీదాసు ♦ లున్నట్టిస్థలముల
యుండినపురుషత్వ ♦ మర్త్యలోన
ఓనాథనీదయ ♦ నెనరుగాబొందిన
పుట్టువేపుట్టువు ♦ పుడమిలోన
గీ॥ కరుణతోనన్ను నేలుము ♦ గరుడగమన
యిన్నినిజమని దెప్పెద ♦ యెంతటన్న
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 26

సీ॥ ఓదయాసాగరా ♦ యోడేనగావరా
గాచుటభారమా ♦ కన్నతండ్రి
శ్రీనాథబ్రోవరా ♦ చిత్తంబదేలరా
రాకున్ననీకన్న ♦ రాజులెవరు
దామోదరాయని ♦ దర్పంబుగాబిల్వ
జూపకుంటివిరూపు ♦ సుందరాంగ
రేపుమాపననేల ♦ దాపులోయుండగ
ప్రాపుగావటర ♦ నాపాలిదేవ
గీ॥ కపటములనునాపైని ♦ కానరార
చపలగుణములవిడగొట్టి ♦ సాకుకోర
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ। 27

సీ॥ శ్రీరామనిన్మది ♦ స్థిరముగా గొల్చిన
పుట్టుగిట్టుట లేదు ♦ పుడమి యందు
శ్రీరామనిన్మది ♦ స్థిరముగా గొల్చిన
దుఃఖసుఖంబులు ♦ తొలగిపోను
శ్రీరామనిన్మది ♦ స్థిరముగా గొల్చిన
కడుకోర్కెలన్నియు ♦ కడకుబోవు
శ్రీరామనిన్మది ♦ స్థిరముగా గొల్చిన
యవగుణంబులుబోవు నడుగుబట్టి
గీ॥ నీదుభక్తికిమించిన ♦ దేదిలేదు
నాదుమొరవినవేమి ♦ నీపాదమెలను
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామ రామ 28

సీ॥ పగలురాతిరినీదు ♦ భజనజేయుచునుంటి
దాశరథేయంటి ♦ దయనుగంటి
శరణన్నదీనుల ♦ చాకువాడవటంటి
రక్షించుటకుముందు ♦ రమ్మనంటి
భక్తిపాలనజేయు ♦ ప్రభువునీవేయంటి
పంతంబులుడుమంటి ♦ ఫలమటంటి
పలుమారునీకథల్ ♦ బహుగజెప్పగనుంటి
నీదయనేగంటి ♦ నిక్కమంటి
గీ॥ నక్కజిత్తులుబోగొట్టి ♦ నమ్మియుంటి
తిక్కగుణమునుబోగొట్టి ♦ తృప్తిమంటి
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 29

సీ॥ భక్తపాలనదేవ ♦ బ్రతికింపుమాదేవ
నయముజూపుముదేవ ♦ భయముదేవ
నందనందనుదేవ ♦ నారాయణసుదేవ
మూలంబునకుదేవ ♦ మురళిదేవ
నానార్థములదేవ ♦ సమ్మతిననుగావ
దంతిగాచినదేవ ♦ ధరణిదేవ
పరమపావనదేవ ♦ ఫలమునిచ్చెడుదేవ
బలరామదేవ ♦ నాబ్రహ్మదేవ
గీ॥ రఘుకులంబునబుట్టిన ♦ రామదేవ
భావమందునయుండెడు ♦ వామదేవ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 30

సీ॥ శ్రీరామనీకంటె ♦ సిరులిచ్చునీనామ
మెక్కువయానెతల్లు ♦ నెంతవరకు
నినుజూపుటకుముందు ♦ నీనామమేకదా
దారిజూపుచునుండు ♦ ధర్మమునకు
సూరినుజలనిపించి ♦ శుద్ధాత్ములనుజేసి
పరలునునీనామ ♦ మిరివిధరకు
బ్రహ్మహత్యాదుల ♦ పారదోలగజాలు
నీనామమహిమంబు ♦ నేటివరకు
గీ॥ గనుటవినుటయుగల్గెనీ ♦ కాలమునకు
అనుటమాత్రము ♦ నీదయయనుటవరకు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమశ్రీ ♦ రామరామ॥ 31

సీ॥ శ్రీరామనీనామ ♦ చింతనమ్ముం జేసి
చేయంగ జేయంగ ♦ జేయుటయ్యె
నీనామమహిమంబు ♦ నిత్యంబుమరువను
పాలుమాలెదవేల ♦ పల్కకయ్య
ఓసుందరాకార ♦ నొకసారియైనరార
జాగేలనే సేదా ♦ చక్కసయ్య
సగుణనిర్గుణరూప ♦ సకలంబుగావగా
భారమానేనెంతో ♦ కోరితయ్య
గీ॥ దాగులాటలుమానవా ♦ ధర్మమయ్య
బాలభక్తులనేలవా ♦ పంపెమయ్య
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామ రామ॥ 32

సీ॥ శ్రీరామనీకేమి ♦ జేసియుండెనహల్య
నల్లచట్టునుమించి ♦ నాతి జేయ
శ్రీరామనీకేమి ♦ జేసెనుయా శబ
రెంగిలిపండ్లను ♦ నెప్పుడాదినను
శ్రీరామనీకేమి ♦ జేసెనుయాగుహు
డభయమివ్వవెబ్రోచివ ♦ శుభగుడనుచు
శ్రీరామనీకేమి ♦ జేసెవిభీషణు
లంకాపురంబిచ్చి ♦ రాజుజేయ
గీ॥ స్వల్పసేవకుమెచ్చెదు ♦ స్వామినీవు
కల్పతరువువునన్నేలు ♦ కపటరహిత
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ। 33

సీ॥ నీకృపామహిమచే ♦ నీమహత్త్వముగనుగొంటి
నిర్మలంబౌకోట ♦ నిజముగంటి
నీకృపామహిమచే ♦ నీసర్వజగమంటి
నీప్రకాశంబుగా ♦ నేనటంటి
నీకృపామహిమచే ♦ నిబ్బరంబునుగంటి
దాసజనులనుగంటి ♦ ఖ్యాతినంటి
నీకృపామహిమచే ♦ నిందలొందకయుంటి
రాకపోకలుగంటి ♦ లేకనుంటి
గీ॥ ఆకలెప్పుడులేదని ♦ యనుచునుంటి
తామసంబునువదలితి ♦ తగ్గుచుంటి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 34

సీ॥ భద్రాద్రిరఘురామ ♦ పావనగుణధామ
పాప్రాంతునినురామ ♦ భక్తరామ
వనవాసశ్రీరామ ♦ సనకాదినుతనామ
పవననందనురామ ♦ బలమురామ
కోదండవరరామ ♦ కువలయజనకామ
కమలాక్షుడవురామ ♦ విమలరామ
జనకజహృద్ధామ ♦ జగతిపాలనరామ
శరణంటినినురామ ♦ సరగరామ
గీ॥ కులముగోత్రములెరుగని ♦ గొప్పరామ
కనులగంటినినిన్నునే ♦ గానరామ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 35

సీ॥ ఓపరమేశ్వరా ♦ యోదేవబాంధవరా
దీనజనోద్ధార ♦ నిష్కళంకవర
ఓప్రేమసాగరా ♦ యోపద్మభాగావరా
దయాసింధుగంభీర ♦ దాసపోషకర
ఓంకారప్రభురార ♦ యోదయానిధిరార
సారసాక్షుడరార ♦ ఘనసుగుణవర
ఓరామరామరా ♦ మారామరామరా
సుగ్రీవరక్షరా ♦ సుజనహితవర
గీ॥ సుతుపసంచనివేడితి • మతినిగనర
మతవిచక్షణ లేనిస ♦ మ్మతముగనర
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 36

సీ॥ పాపాలిదైవమా ♦ కాపాడిబ్రోవుమా
బ్రోవకున్ననుయేరి ♦ బ్రోచువారు
నాపుణ్య భాగ్యమా ♦ నన్నెంతొగాంచుమా
గాంచకున్నను యేరి ♦ గాంచువారు
నాపెన్నిధానమా ♦ నాచెంతనుండుమా
నుండకున్ననుయేరి ♦ నుండువారు
నాప్రాణ సుగుణమా ♦ నామాటజెప్పుమా
చెప్పకున్ననుయేరి ♦ చెప్పువారు
గీ॥ లేరునాకింక నెవ్వరు ♦ లేరు యెవరు
దారిజూపింపనీకన్న ♦ కోర నెవరు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమశ్రీ ♦ రామరామ॥ 37

సీ॥ నీ నామ భజనమ్ము ♦ నిత్యంబు జేసిన
కామమోహములెల్ల ♦ గదలిపోవె
నీ దివ్య చరితంబు ♦ నిత్యంబు వినినచో
యిలకష్టజాలముల్ ♦ తొలగిపోవె
నీ భక్తి స్నేహంబు ♦ నిత్యంబు జేసినా
పాపసంఘములన్ని ♦ పగిలిపోవె
నీ ధ్యానమును సదా ♦ నియతితో నిల్పిన
మాయ సంసారంబు ♦ మాసిపోవె
గీ॥ విడివి నినువేడువారికి ♦ వరములివవె
అరయ నిన్నెంతవాడను ♦ నామకోవె
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 38

సీ॥ హేనాథ పలుమారు ♦ యోనాథయన్నను
తనివిదీర్చవుయేమి ♦ ధర్మమయ్యా
హేశౌరి పలుమారు ♦ నాశౌరియన్నను
తృప్తి బొందించవది ♦ తృప్తటయ్యా
హేప్రభూ పలుమారు ♦ మాప్రభోయన్నను
కలనైన రావదే ♦ కష్టమయ్యా
హేబంధుపలుమారు ♦ తాబంధుయన్నను
తత్వార్థమునునివ్వ ♦ తప్పటయ్యా
గీ॥ మానసంబున నిన్ను నే ♦ మరువనయ్యా
మేలుజూపకయుండుటే ♦ చాలటయ్యా
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 39

సీ॥ ఎన్నెన్నో విధముల ♦ సన్నుతించినగాని
కన్నెత్తి చూడవే ♦ కారణంబు
మున్ను జేసినపాప ♦ ములనైన జెప్పవు
గోపనం జేసినా ♦ కుచ్చితంబు
పాపపుణ్యమ్ముల ♦ పట్టిజూడకనీవు
మౌనంబుగాయుంట ♦ మానసంబు
పలువిధంబుల ♦ నిన్ను బిలచుచుండినగాని
రవ్వంత బలుకవే ♦ రక్షణంబు
గీ॥ దండి దొరవని నమ్మితి ♦ తక్షణంబు
మొండివాడను విడనింక ♦ ఖండితంబు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామమ 40

సీ॥ నీనామ మహిమచే ♦ గావంగ పతితులు
పావనులైరింక ♦ భాగ్యులైరి
నీచరిత్రను చదివి ♦ నిక్కముగభక్తులు
మరలజన్మములేని ♦ మహిమగనిరి
నీమంత్రమునుసదా ♦ నేర్పుతోయోగులు
జపియించివెలలేని ♦ జయముగొనిరి
నీరూపువీక్షించి ♦ నిశ్చలమతిబూని
పరముగాంచిరికొంత ♦ భయమువిడిరి
గీ॥ నిరుపమానందగోవింద ఖరపువిరారి
చేరియున్నాడనీదరి ♦ చేర్చుదారి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 41

సీ॥ పరమాత్మనిన్ను నే ♦ పలుమారునుతి జేయ
గనుపడిరక్షించి ♦ గావలేవె
ఎన్నెన్నొవిధముల ♦ నిన్ను బిల్చినగాని
తప్పకొయ్యను వచ్చి ♦ తేల్చలేవె
సతతంబునీసేవ ♦ సల్పుచుండితిగాని
సుంతదయతో నన్ను ♦ చూడలేవె
అంతటానీవని యెంతజెప్పినగాని
కామక్రోధాదులన్ ♦ గాల్చలేవె
గీ॥ భక్తితో నిన్నుగొలిచిన ♦ పంతమిడవె
ముక్తినీవంచుయుంటినే ♦ మ్మౌనమునియవె
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 42

సీ॥ నీకన్నదైవంబు ♦ నాకున్న దెవరయ్యా
మోసంబుబూనకు ♦ ముదమటయ్యా
మరువకనీనామ ♦ మంత్రింబుజపియింప
భయముదీర్చవదేమి ♦ పరువటయ్యా
దిక్కు-లేకనుయున్న ♦ దీనజనుండను
యింతకాలముజరుప ♦ యిరువటయ్యా
పుట్టినదాదిగా ♦ పట్టితినీదివ్య
పదములరజమునా ♦ పాలటయ్యా
గీ॥ పట్టువిడుపులు లేకనే ♦ పట్టటయ్యా
ఇట్టివాడవ నెరుగనే ♦ మట్టుకయ్యా
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 43

సీ॥ ఏసుఖంబునుగోర ♦ కెందరో భక్తులు
నీసుఖంబునుగోర ♦ వాసితోను
ఏసుఖంబునుగోర ♦ కెందరో యోగులు
నీసుఖంబునుగోర ♦ వాసితోను
ఏసుఖంబునుగోర ♦ కెందరో సాధులు
నీసుఖంబునుగోర ♦ వాసితోను
ఏసుఖంబునుగోర ♦ కెందరో సిద్ధులు
నీసుఖంబునుగోర ♦ వాసితోను
గీ॥ దాసపోషకనిన్నింక ♦ బాసిపోను
దాసుజేయనిఘుటము కే ♦ వాసిపోను
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 44

సీ॥ బాల్యంబునుండినీ ♦ భజనజేయనుగంటి
సనుబోవమనియుంటి ♦ న్యాయమంటి
నీకథల్ యెప్పుడు ♦ నియతితో వినుచుంటి
నీదయన్ నాపైని ♦ నిలుపుమంటి
నీభక్తులతో చెల్మి ♦ నిత్యజేయుచునుంటి
నీమహాత్మ్యము నెన్న ♦ నేమటంటి
శరణాగతత్రాణ ♦ బిరుదునీదనివింటి
పరులనమ్మనటపెద్ద ♦ కరువెయుంటి
గీ॥ కామితార్థములిచ్చెడు ♦ కరుణగంటి
దేవదేవుడవనియుంటి ♦ దేశమంటి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 45

సీ॥ రాజరాజపురామ ♦ రాగమ్మ శ్రీరామ
దరికిజేర్చుమురామ ♦ దయతోను రామ
పరమ పావనరామ ♦ భరతు నేలినరామ
శరణు జేసెదరామ ♦ శరణురామ
నీలమేఘశ్యామ ♦ నిన్నే నమ్మితిరామ
ప్రేమ మీరగ రామ ♦ ప్రియముగ రామ
సకల జీవులరామ ♦ సామ్రాజ్యహారిరామ
మాపు రేపున రామ ♦ మయముగ రామ
గీ॥ దాపుజేరినవారికి ♦ దాపురామ
ప్రాపుగోరినవారికి ♦ ప్రాపురామ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 46

సీ॥ నీధ్యాన్న మొనరింప ♦ నిశ్చలత్వమునియ్య
వేమయ్యధరలోన ♦ స్వామిపయ్య
యందాక నీకునే ♦ నెదురు జూచెదనయ్య
సరసముగారావ ♦ సరసమయ్య
నమ్మివందులకింత ♦ నాయమ్మ జేకయ్య
సమ్మతించగదయ్య ♦ సమ్యసయ్య
వందనం బిచ్చెనయ్య ♦ బాధముల్ దుంచయ్య
సందేహమేమయ్య ♦ తొందరయ్య
గీ॥ గొప్పవాడవునీవని ♦ కోరితయ్య
అప్పదాసుని మొరవినుం ♦ టందమయ్య
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 47

సీ॥ ఒకమాటుసీనామ ♦ మొప్పుగా దలచిన
బ్రహ్మ హత్యాదులు ♦ బ్రతుకగలవ
ఒకమాటుసీనామ ♦ మొప్పుగాదలచిన
దారిద్ర్యదుఃఖముల్ ♦ తగ్గిపోవ
ఒకమాటుసీనామ ♦ మొప్పుగా దలచిన
చిటికలోపనులన్ని ♦ చిక్కిపోవ
ఒకమాటుసీనామ ♦ మొప్పుగాదలచిన
సకలసంపదలన్ని ♦ చక్కగానవ
గీ॥ యిట్టిపృభువయ్య ♦ నాపాలనేలరావ
పట్టుగట్టిగబట్టితి ♦ నెట్టుతావ
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ। 48

సీ॥ ఫలముగోరనికర్మ ♦ ప్రాకటంబుగజేసి
భగవంతుడాయని ♦ పలుకుచుంటి
సత్యంబుదప్పక ♦ సంసారముల్ జేసి
భగవంతుడాయని ♦ పలుకుచుంటి
వాదభేదములేని ♦ వైరాగ్యమునుబూని
భగవంతుడాయని ♦ పలుకుచుంటి
మోదఖేదములేని ♦ మోక్షంబునకుజూచి
భగవంతుడాయని ♦ పలుకుచుంటి
గీ॥ రేబగళ్ళనకనునిన్ను ♦ బాముగంటి
దాబలంబునునిచ్చినన్ ♦ ధరణిగంటి
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 49

సీ॥ మర్మంబులనుద్రుంచి ♦ మనసు నెక్కటిజేయు
నుపమానమును నాకు ♦ కృపనునివ్వ
కామాదిగుణముల ♦ కడకుజిమ్మఁగాను
నుపమానమును నాకు ♦ కృపనునివ్వ
తాపత్రయమ్ముల ♦ తగిలికొట్టగవలె
నుపమానమును నాకు ♦ కృపనునివ్వ
సజ్జనమ్ములపొందు చక్కగాలభించు
నుపమానమును నాకు ♦ కృపనునివ్వ
గీ॥ కృపకుపాత్రుడనయ్యెదు ♦ కృపనునివ్వ
చపలగుణములునణిగెడు ♦ కృపనునివ్వ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 50
సీ॥ శాశ్వతంబగుపదవి ♦ సాధించవలెనన్న
నీపాదయుగళంబు ♦ కాపురంబు
సజ్జనంబులగోష్టి ♦ సంపాదనముజేయ
నీపాదరేణువుల్ ♦ నిజముసందు
జగతిలోనున్నట్టి ♦ సౌఖ్యంబులనుబొంద
నీపాదతీర్థంబు ♦ నిజమునందు
లోకలోకములన్ని ♦ లోబరుపవలెనన్న
నీసఖమ్ములకాంతి ♦ నేనుగందు
గీ॥ పూజగోరిననీపాద ♦ పూజటందు
స్వామిగావలెయన నమ ♦ స్కారమందు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 51

సీ॥ రఘుకులజలనిధి ♦ రక్షకుండ ప్రమది
మరచియుండిన నేను ♦ మనుట యెట్లు
నీదరి జేరగా ♦ నిన్ను నమ్మినవారి
పగను సాధింతువా ♦ పాపదారి
అందుంచుయుంచున లేక ♦ యెంద్రైనయుంటివి
సందేహమేలనో ♦ సాధుభావ
సుతుడను నేనంచు ♦ గతినీవటంచును
బ్రస్తుతించుచునుంటి ♦ పరమపురుష
గీ॥ మనకులంబున రెండన ♦ మాటగలదె
మునికులంబున కెల్లను ♦ మోదమివ్వ
సంత గుడిపాటిపుర ధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 52

సీ॥ సత్కర్మలను జేసి సంశయంబును బాసి
పూనితినీ భక్తి ♦ పూర్ణముగను
భక్తి చెలిమియు జేసి ♦ పాపసంఘము వాసి
పూనితినీ భక్తి ♦ పూర్ణముగను
శక్తికొలంది నే ♦ జయమంటి ధర్మంబు
పూనితినీ భక్తి ♦ పూర్ణముగను
చెప్పినట్టు నడచి ♦ తప్పొప్పులను జూచి
పూనితినీ భక్తి ♦ పూర్ణముగను
గీ॥ యింక యాలస్యమేలనో ♦ పంకజాక్ష
సమయము మాయనుదయ చేయుము ♦ సారసాక్ష
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 53

సీ॥ రామకృష్ణాయని ♦ రయమున బిలువగా
పలుకకుంటివి నీవు ♦ భక్తపాల
దీనబంధోయని ♦ దీనమతి నే గొల్వ
దయజూపకుంటివి ♦ తండ్రి యేల
పతితపావనయంచు ♦ సతతంబు నే నియాడ
గతియే మొనరింపవి ♦ క్షితిని చాల
ఓదయాసాగరా ♦ కావని చెప్పరా
కనికరంబును లేద ♦ కనకచేల
గీ॥ ఆర్తరక్షణ మాబోటి ♦ యార్తిజనుల
పిలచి రక్షింపకున్ననీ ♦ పేరు యేల
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 54

సీ॥ శ్రీరామమంత్రంబు ♦ శిక్షతో పఠియింప
కున్నవారలునుండి ♦ యుండ కేమి
పండువెన్నెలబయల్ ♦ పాటించి చూడని
చదువుచదువటంచు ♦ చదువు లేమి
తుదమొదల్లేనట్టి ♦ తుచ్ఛసుఖంబులు
కోరినఫలమేమి ♦ కోర కేమి
మీరనివ్యక్తిపై ♦ మిడిమేలముగ బోయి
కొట్టినఫలమేమి ♦ కొట్ట కేమి
గీ॥ వట్టిమాటలు నెన్నిన ♦ పట్టు లేమి
గుట్టుదెలసెను మరువ ఝా ♦ పట్టు నేమి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ॥ 55

సీ॥ శ్రీదేవనీకృతి ♦ చెప్పనీకవి యేల
పతిలేనిప్రాణికి ♦ బ్రతుకదేల
కరుణామయనిన్ను ♦ గాంచనికలివేల
తలిదండ్రినిందించు ♦ తనయులేల
సేయుసేవలునీకు ♦ సేయనితనువేల
పరులదిట్టెడుజన్మ ♦ బ్రతుకదేల
మోక్షంబుఁగోరని ♦ రక్షణీయునదేల
సూక్ష్మంబునెరుగని ♦ సుదతదేల
గీ॥ దాక్షిణ్యముగాంచని ♦ తండ్రియేల
శ్రేష్ఠసోమునిమగఁడ ♦ పేరుచాల
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 56

సీ॥ దాశరథేయన్న ♦ దర్శనమివ్వుమా
నిరుపేదకుడనన్న ♦ నెనరునుంచు
కౌసల్యవరపుత్ర ♦ కరుణతోననుగాంచు
పరమునివ్వుమటన్న ♦ పారజూడు
సిరికిపెన్మిటివన్న ♦ శిక్షించిననునేలు
సాక్షివినీవన్న ♦ సంతరించు
భరతలక్ష్మణయన్న ♦ బ్రతికింపుమనియన్న
స్థిరమునివ్వుమటన్న ♦ స్థిరమునివ్వు
గీ॥ చూడుశత్రుఘ్నుడన్ననన్ ♦ సూక్ష్మదృష్టి
నోరునొవ్వంగనినుగూర్చి ♦ నుడువుచుంటి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 57

సీ॥ శ్రీరామయనినిన్ను ♦ చింతించువారికి
పేరవుయాపదల్ ♦ జెప్పవయ్యా
శ్రీరామయనినిన్ను ♦ చింతించువారికి
తెరుగు లేవనివింపు ♦ ధరణియందు
శ్రీరామయనినిన్ను ♦ చింతించువారికి
యాకలిదప్పలు ♦ కాకపోను
శ్రీరామయనినిన్ను ♦ చింతించువారికి
మూడులోకములందు ♦ ముదమునందు
గీ॥ అహహ నీదయ నిరుపమా ♦ నందమయ్యా
యిహపరంబులునివ్వ యిం ♦ కెవరురయ్యా
సంతగుడిపాటిపుర ధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 58

సీ॥ సందుగొందులయందు ♦ సర్వజీవులయందు
యెందుజూచిననీవు ♦ సందునుందు
భక్తబృందములందు ♦ భరతదేశమునందు
యితరదేశములందు ♦ యిరువునందు
యాకాశవాయువుల ♦ యగ్నియుజలమందు
పృథ్వితత్వమునందు ♦ ప్రియమునందు
కులపర్వతములందు ♦ కలియుగంబులనుందు
వనములందునునుంచి ♦ వనములందు
గీ॥ సందులేకనునంతట ♦ నుందువందు
చంద్రసూర్యులునీవని ♦ చక్కగందు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 59

సీ॥ శ్రీరామజయరామ ♦ సీతామనోహర
కనికరంబునన్ను ♦ గావరార
శ్రీరామజయరామ ♦ సీతామనోహర ।
కన్నెత్తిజూచిక ♦ కరుణగనర
శ్రీరామజయరామ ♦ సీతామనోహర
పలుకరించినన్ ♦ పాపమటర
శ్రీరామజయరామ ♦ సీతామనోహర
మునిశేగానవిలోల ♦ ముక్తివర
గీ॥ యెన్ని సారులుయన్నను ♦ యిహమపరము
తప్పుజేసితివనినన్ను ♦ తరుమఘనమ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 60

సీ॥ నీకృపా మహిమచే ♦ నిందజెందకయుంటి
నీకృపా మహిమచే ♦ నిక్క-గంటి
నీకృపా మహిమచే ♦ నీకర్తనముగంటి
నీకృపా మహిమచే ♦ నీతిగంటి
నీకృపా మహిమచే ♦ నిబ్బరంబుగనుంటి
నీకృపా మహిమచే ♦ నేనునుంటి
నీకృపా మహిమచే ♦ నీరజుభవుగంటి
నీకృపా మహిమచే ♦ నిఖిలమంటి
గీ॥ నుండువరకును నీకృప ♦ నుండగంటి
దుండగీడులజేరక ♦ నుండగంటి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 61

సీ॥ ఓరాఘవాయని ♦ నొకమారుస్మరియింప
మూడులోకములందు ♦ ముదముఁ బొందు
ఓ రాఘవాయనిం ♦ కొకమారుస్మరియింప
మూలప్రకృతికిని ♦ చాలియుండు
ఓ రాఘవాయనిం ♦ కొకమారు స్మరియింప
పంచభూతంబుల ♦ ప్రభువుగాను
ఓరాఘవాయనిం ♦ కొకమారుస్మరియింప
నీలోకమందున ♦ నిల్చిపోవు
గీ॥ కడకు నో రాఘవాయన ♦ కలుగు సిరులు
విడక నో రాఘవాయన్న ♦ వీడవారు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ। 62

సీ॥ నాప్రాణధనమని ♦ నమ్మినందులకిట్లు
మోసంబు జేయుట ♦ మోసమయ్యా
నాదైవమనినిన్ను ♦ నమ్మినందులకిట్లు
జాలిబుట్టకయుంట ♦ జాలినయ్యా
నాతండ్రియని నిన్ను ♦ నమ్మినందులకిట్లు
నిర్దయంబూనుట ♦ నిర్దయయ్యా
నాప్రభువీవని ♦ నమ్మినందులకిట్లు
రక్షించకుంట ని ♦ రక్షటయ్యా
గీ॥ సాధుభావనజూపించు ♦ చల్లనయ్యా
కాదు లేదనకిట్టుల ♦ క్రిమమటయ్యా
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 63

సీ॥ శ్రీ రామచంద్రమా ♦ శ్రితజనానందమా
పార్వతీశ్వరస్తోత్ర ♦ పాహిపాహి
వరరామచంద్రమా ♦ బలరామచంద్రమా
భగవంతుడవునీవు ♦ పాహిపాహి
భాగ్యదేవేంద్రనై ♦ రాగ్య దేవేంద్రమా
పవను నందనుగన్న ♦ పాహిపాహి
గుణనిధి చంద్రమ ♦ గురురాజచంద్రమ
భయము మాన్పెడుస్వామి ♦ పాహిపాహి
గీ॥ పామరుండను జడుడను ♦ పాహిపాహి
భద్రిగుణముల వర్తిల్లు ♦ పాహిపాహి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 66

సీ॥ నినుభజించిన వార్ని ♦ నిజముగాపోషింప
దానకంకణమున్న ♦ ధర్మమేమి
నీకథల్ వినువారి ♦ నిజముగాపోషింప
చక్రాయుధమునుండ ♦ జంకుటేల
నీ సేవకులనంత ♦ నిజముగాపోషింప
కోదండమేయుండ ♦ కోపమేల
నీదాసదాసులన్ ♦ నిజముగాపోషింప
ఖడ్గంబుచేనున్న ♦ కావవేల
గీ॥ కన్నవారిని నేలను ♦ గదయునుండ
చూచిచెప్పనుమంచికో ♦ స్తుభమునుండ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 67

గీ॥ నీనామమహిమచే ♦ నిరుపమానందంబు
పొందితినయ్యా నే ♦ క్షేమశయన
నీనామమహిమచే ♦ జ్ఞానంబుగలిగెను
నీ తేజమున నేను ♦ నియతిగంటి
నీనామమహిమచే ♦ నీభక్తులలోదూరి
భజనచేయుటగల్గె ♦ పరమసుఖము
నీనామమహిమచే ♦ వానలుగురుసుగా
పంటలుబండుగా ♦ భద్రియశేము
గీ॥ నీదునామంబువర్ణింప ♦ లేమజగతి
లేదునింకొకటేర్పాస ♦ రాదుజగతి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 68

సీ॥ జానకీనాథ నీ ♦ చరణ సన్నిధిదప్ప
యితరచోట్లకునన్ను ♦ యీడ్వకయ్య
జయరామనీమధు ♦ చరితామృతముదప్ప
యితరరుచులటంచు ♦ యీడ్వకయ్య
పతితపావన నీదు ♦ భక్తిమార్గముదప్ప
యితర మార్గములకు ♦ నీడ్వకయ్య
వైరాగ్యపురుషనీ ♦ వరమంత్రమునుదప్ప
యితరమంత్రములంచు ♦ నీడ్వకయ్య
గీ॥ శ్రీరమారమణయనుట ♦ జెప్పుమయ్య
కామసంకల్పములదుంచి ♦ కావుమయ్య
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 69

సీ॥ అల్పసుఖములవిూ ♦ దాశను విడగొట్టి
శాశ్వతానందంబు ♦ సరగునిమ్ము
యల్పమిత్రులతోడి ♦ కల్పనంబునుగొట్టి
సజ్జనంబుల కలిమి ♦ సరగునిమ్ము
యల్పధనమ్మైన ♦ తైకు్రియత్నముసల్పు
జ్ఞానధనమ్మును ♦ సరగునిమ్ము
యల్పవరమ్ముల ♦ నణుగను జేనింక
తిరిగి వైకుంఠంబు ♦ సరగునిమ్ము
గీ॥ వ్రతములన్నిటనినుగొల్పు ♦ వ్రతమునిమ్ము
గతియునీవనిగొల్చితి ♦ కరుణగనుము
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ। 70
సీ॥ సర్వేశ్వరానీకు ♦ సంకల్పమేమొకో
హీనసంసారంబు ♦ పూనిసేయ
మాయసంపదలిచ్చి ♦ మమతలుగల్పిరాప
నేమిటికో తెల్య ♦ దేమిసేతు
దారసుతామలకా ♦ తాత్పర్యలోనిగికించి
కష్టపెట్టుటకుంచి ♦ శ్రమముదప్పి
దుఃఖసుఖమ్ముల ♦ ద్రోయఁగానన్నిట్లు
యేమిలాభమునీకు ♦ నెంతవరకు
గీ॥ పాపపుణ్యము లేలనో ♦ నాపుటకును
శోకతాపములన్నిట ♦ గూల్చుటకను
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 71

సీ॥ నారదవాల్మీకు ♦ లారసినినుగొల్వ
కడుభక్తినిచ్చియు ♦ గాపలేదె
అంబరీషాదుల ♦ నాపూర్వభక్తుల
సంచితంబుగనాద ♦ రించలేదె
నయనారుజయదేవ ♦ నామదేవులనిప్డు
సంచితంబుగనాద ♦ రించలేదె
తులసిమాధవదాసు ♦ సలతుకారాముల
సంచితంబుగనాద ♦ రించలేదె
గీ॥ రామదాసకబీరుల ♦ రక్షణమ్ము
జేసితివిగానినేనన్న ♦ జేయవేమి
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 72

సీ॥ నీపాదజలములు ♦ నిజముగాశిరమందు
దాల్చినగుహుడేమి ♦ తపముజేసె
నీపాదకమలముల్ ♦ నిజముగాశిరమందు
ధరియించెహనుమంతు ♦ ధర్మమేమి
నీపాదములకొల్వ ♦ నిత్యంబుమరువని
లక్ష్మణస్వామియే ♦ లక్ష్యముంచె
నీపాదదర్శనమ్ ♦ నెప్పుడుగోరెడు
భరతుడేభాగ్యమ్ము ♦ బాగజేసె
గీ॥ ప్రతిదినమ్మునతమయద్దు ♦ లతిముదమున
హృదయకమలములందువ ♦ హించెసీత
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 73

సీ॥ పతితపావననిన్ను ♦ నుతియించుటకునాకు
నిశ్చలత్వమునిమ్ము ♦ నెమ్మితోడ
పతితపావననీదు ♦ పరమరహస్యంబు
కర్ణేంద్రియంబుల ♦ క్రిమతబంపు
పతితపావననీదు ♦ యతిసుందరంబును
ముదముతో కనులకు ♦ నొదవనిమ్ము
పతిపపావననీదు ♦ పాదపద్మమ్ములు
నంటుభాగ్యముమాకు ♦ సంటనిమ్ము
గీ॥ చిత్తమందుననీవుండు ♦ చిత్తమిమ్ము
మరలకుండెడుభక్తని ♦ మరలనిమ్ము
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామ రామ॥ 74

సీ॥ శ్రీరామచంద్రనీ ♦చిత్తంబుగనిపెట్ట
బ్రహ్మదేవునికైన ♦ భాగుగాదు
సామజవరదనీ ♦ సౌందర్యమింతన
నాదిశేషునకైన ♦ నలవిగాదు
పావనచరితనీ ♦ బలపరాక్రింబెన్న
యలబృహస్పతికైన ♦ నలవిగాదు
బుధజనవినుతనీ ♦ బుద్ధితత్వమునెంచ
బ్రహ్మరాణికినైన ♦ పట్టువడున
గీ॥ కోసలాపురవరనీదు ♦ వాసినెన్న
దాసజనులకునలవియె ♦ ధరణిలోన
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 75

సీ॥ రూపురేఖనుబట్టి ◆ రూపుజేయుదమన్న
రూపములన్నిటన్ ◆ రూపునీవు
నీవుండుస్థలమేదో ◆ నిక్కమెంచెదమన్న
స్థలమహాత్మ్యము మొదల్ ◆ తరముగాదు
నీదుసంచారంబు ◆ నిజముగండుమటన్న
సంచారమంతకు ◆ జతనుపడదు
స్వాంతమందున నీదు ◆ సాంజ్ఞగాందమటన్న
పడియుంటికునలవి ◆ యసలెకాదు
గీ॥ సేయునది లేక నామంబు ◆ వ్రాయుచుంటి
వినుచునుంటిని నీనామము ◆ మనుచునుంటి
సంతగుడిపాటి పురధామ ◆ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ◆ రామరామ॥ 76

సీ॥ సప్తకోటులలోన ◆ చాలినమంత్రంబు
తారకమనివింటి ◆ తత్త్వవిదుల
మూర్తిత్రయమ్మున ◆ మూలంబు నీవని
చదివితిగ్రంథముల్ ◆ చాలచాల
మత సమూహములందు ◆ మరువను నీయొక్క
మహిమ చెప్పక వేరు ◆ మహిమగలదె
భువనంబులకు నాది ◆ పురుషుండవని నిన్ను
నమ్మికొల్చెదనయ్య ◆ సమ్మతింపు
గీ॥ నమ్మి నమ్మని వారికి ◆ నయముగనవు
మోక్షమడిగితినయ్యనిక్ ◆ మోహనాంగ
సంతగుడిపాటిపురధామ ◆ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ◆ రామరామ 77

సీ॥ దశముఖసంహార ♦ దయతోడ నేలర
యనినిన్ను బాడగా ♦ యఘములుడుగు
రామకృష్ణాయంచు ♦ ప్రేమతో బల్కిన
మరలజన్మము రాక ♦ మడియునయ్య
సురరక్షకాయని ♦ చూచి చెప్పిననిన్ను
కోరితలుండినభువి ♦ కోలుపోవె
యాదినారాయణ ♦ యవతారపురుషమా
యనినుతించెడివారి ♦ ధనముసుఖము
గీ॥ సంతసంబుననినుగొల్చు ♦ సరసులకును
చింత లేదనివింటి నే ♦ చివరవరకు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ 78

సీ॥ సర్వభూతములందు ♦ సర్వశబ్దములందు
సర్వశాస్త్రములందు ♦ సాక్షివైతి
వేదంబులునునాల్గు ♦ వేదాంతఫణితికి
త్రోవలన్నిటికీవె ♦ త్రోవవైతి
నిర్గుణంబులజూడ ♦ నియతిగుణంబుల
తీర్థక్షేత్రములును ♦ తిరిగినీవె
కలజగంబులయందు ♦ కర్మకాండలయందు
నుర్విజలములందు ♦సర్వమందు
గీ॥ నేటికింకనుజెప్పుట ♦ తోటలందు
నాటపాటలయందు నే ♦ చోటులందు
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ 79

సీ॥ ఓపరమాత్మనిశ ♦ యోముకుందాయని
పిలుచుచుంటినినిన్ను ♦ పలుకవేమి
యోపరమేశ్వరా ♦ యోదయానిధియని
స్మరణచేసితినింక ♦ కరుణగనుము
యోదీనమందార ♦ యోకేశవాయని
మాటిమాటికినంటి ♦ మరుపుగలద
యోరఘుపుంగవా ♦ నారాయణాయని
నీసేవచేసితిగ ♦ నిర్మలాత్మ
గీ॥ యింతకఠినంబు బూనుట ♦ ఎందుకయ్య
యేమిచేసిననేనేమి ♦ చేయగలను
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ 80
సీ॥ సీమాదిపద్యముల్ ♦ నేరచించితిగాని
పరులపద్దెమునందు ♦ పట్టుబోను
నీచరిత్రముజెప్ప ♦ నేబూనితినిగాని
చరితముల్ నేనేమి ♦ చదువలేదు
నీదుదర్శనభాగ్య ♦ నియతిగోరితిగాని
దర్శనంబును నేను♦ దాచలేను
నీపాదములుసదా ♦ నెరనమ్మితినిగాని
మదిలోననింకొక ♦ మాటగాదు
గీ॥ నీదుదయలేక కాయంబు ♦ నిలువరాదు
సాధుజనపోషవినుమిక♦ చాలుచాలు
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 81

సీ॥ నాదేవదేవరా ♦ సన్నుతిమురహార
మాటలోపలరాని ♦ మంచిగార
నాపాపపరిహార ♦ నామొరవినరార
నీప్రాపుఁగోరితి ♦ నిర్వికార
నాచింతలెడబాపి ♦ ననునడతేర్చరా
కారకుండవునీవు ♦ కడకురార
నాయిష్టమునుమగర ♦ ననుకనుల్ గాంచర
గాంచుటనేరమా ♦ కలుషహార
గీ॥ ఆపదోద్ధారకనను బ్రోవ ♦ పాపమటర
కోపమేలర నీవాడ ♦ ప్రాపుగార
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 82

సీ॥ ఎన్నిసారులుబిలచి ♦ విన్నవించినగాని
కన్నెత్తిచూడవే ♦ కమలనయన
యెన్నివిధములనిన్ను ♦ సన్నుతించినగాని
రానికారణమేమొ ♦ రామరామ
యెన్నికీర్తనలందు ♦ నిన్నుబాడితిగాని
మారుమాటయురాదు ♦ మహిమగనను
యెన్నిపద్యములైన ♦ నిన్నుచెప్పితిగాని
నన్నునమ్మవదేమి ♦ న్యాయమౌనొ
గీ॥ చదువులన్నిటనిన్ను నే ♦ చదివితయ్య
ముదము మీరగ నీకృప ♦ ముదమునియ్య
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 83

సీ॥ నీపాదపద్మముల్ ♦ నెరనమ్మి కొల్చెద
సాధుభావన నాకు ♦ సమతనివ్వ
కావ్యంబులల్లోనిదు ♦ కావ్యంబుజదివెద
గోషపుంజములన్ని ♦ హూళిపుంచు
భక్తజనావళి ♦ భక్తిమతోడగలసెద
ముక్తినిదయసేయు ♦ శక్తిగోలది
రామతారకమంత్రి ♦ రాజంబునమ్మెద
నీలోకమును జేర్చు ♦ నిశ్చయముగ
గీ॥ కరుణగల్గియు యుండుంట ♦ గాదనాక
భేదమెంచకననుబ్రోవు ♦ లేదనాకు
సంతగుడిపాటి పురధామ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ రామరామ। 84

సీ॥ జలబుద్బుదముబోలు ♦ జన్మంబు యిదియని
నిన్ను నమ్మితిరామ ♦ నన్ను బ్రోవు
సారంబులేని సం ♦ సారమంచనిమది
నిన్ను నమ్మితిరామ ♦ నన్ను బ్రోవు
కలతోటి సమమని ♦ కలియుగంబిదియని
నిన్ను నమ్మితి రామ ♦ నన్ను బ్రోవు
ఎండమావులబోలు ♦ నుండుసంపదయని
నిన్ను నమ్మితిరామ ♦ నన్ను బ్రోవు
గీ॥ సచ్చిదానందరూపనీ ♦ సరణిగన్న
వారికెన్నడు నయాపద ♦ వచ్చునటర
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 85

సీ॥ ఏదిశాశ్వత మేది ♦ యేదిసత్యమటన్న
యేది నీనామంబు ♦ కాదువినుము
రూపంబులన్నిట ♦ రూపుసేయుదమన్న
యేదినీరూపంబు ♦ కాదుకాదు
సంపద లన్నిటఁ ♦ సమము చెప్పెదమన్న
నీసంపదకుసరి ♦ నిజముకావు
బలమేదోయనినేను ♦ పారజూచితిగాని
బలములన్నిటనీకు ♦ బలములావు
గీ॥ ప్రేమ నీప్రేమకునురాదె ♦ ప్రేమమైన
మాటలుమాటలుగావివి ♦ మంచి నెంచు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 86

సీ॥ సాలోక్య పడవని ♦ సాధుపుంగవులంత
సహసంబుగానిన్ను ♦ తరచుచుంద్రు
సామీప్యమనవని ♦ సచ్చరిత్రులుపొందు
గడియగడియకు ని ♦ న్నడుగుచుంద్రు
సారూప్యమునివింటె ♦ సంయమీంద్రులువాద
భేదంబులును నుడ్గి ♦ బీదలైరి
సాయుజ్యమముజెంద ♦ మాయుజ్యమమునంత
గోటమీటినవారి ♦ పాటుగనుడు
గీ॥ భాగవతులును నీనామ ♦ భజనగోర
పిందుగోవింద యనుచుందు ♦ రుందురార
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 87

సీ॥ ఇంతకాలముండి ♦ యెంతో వేడినగాని
సుంతబలుకవదేమి ♦ సుందరాంగ
నీవుదేవుడవని ♦ నిన్నునమ్మితినయ్య
దయజూపకుంటివే ♦ ధర్మమయ్య
పిరికినిబోగొట్టి ♦ దరికిజేరగనెట్టి
ధైర్యంబుబోధించు ♦ తరళనయన
సారెసారెకునిన్ను ♦ సన్నుతించుటకాని
మారుబల్కుటలేదు ♦ మదనజనక
గీ॥ వీరరాఘవనన్నిట్లు ♦ వేసవేయ
నేరమేమియుజేసితో ♦ నీకునింత
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 88

సీ॥ కీరపండరియందు ♦ జేరియుండినవాడ
ననుబ్రోవనీవాడ ♦ నల్లవాడ
భక్తులకోరికల్ ♦ బహుగదీర్చెడురేడ
పాలింపరారస ♦ ద్భక్తునీడ
దివ్యసుఖములనివ్వ ♦ దిక్కునీవనివేడ
రక్షించబూనుమా ♦ రక్తితోడ
ఆశ్రయించినవారి ♦ కభయమిచ్చెడువాడ
దాసానదాసుడన్ ♦ దయనువేడ
గీ॥ అప్పదాసునిమొరవిను ♦ గొప్పవాడ
తప్పులెన్నకునాపైని ♦ ధర్మమీడ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 89

సీ॥ తండ్రి ప్రహ్లాదుని ♦ దగహింసపెట్టగా
తెలియకపోయెనా ♦ దీనబంధొ
కరిమకరికిజిక్కి ♦ గాసిల్లునందాక
తెలియకపోయెనా ♦ దీనబంధొ
సీతరావణుచేత ♦ చిక్కి-దుఃఖించెను
తెలియకపోయెనా ♦ దీనబంధొ
గోపన్న ఖైదులో ♦ వాపోవునందాక
తెలియకపోయెనా ♦ దీనబంధొ
గీ॥ అహహానీచర్యలెన్నంగ ♦ నద్భుతంబు
దాపుజేరినవాడను ♦ తారకంబు
సంత గుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 90

సీ॥ శ్రీరామనీసేవ ♦ జేయువారలకెల్ల
వైకుంఠపదవిని ♦ వసుసనిసగ
శ్రీరామనిన్మది ♦ చింతించువారికి
కోరినకోర్కెల్ ♦ తీరనివవె
శ్రీరామనీకథల్ ♦ జెప్పుచుండెడివారి
కేదివచ్చినమీాది ♦ మోదమివవె
శ్రీరామనీమీాది ♦ చిత్తముంచినవారికి
తిరుగేమిలేదని ♦ ధరణిజెప్పి
గీ॥ ప్రతిదినంబును నేనింత ♦ బ్రతిమిలాడ
వచ్చిచూడవుశరణని ♦ వచ్చువాడ
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 91

సీ॥ నీభక్తపరులకు ♦ నిత్యకష్టముబెట్టి
తిరిగిబ్రోచుటనీకు ♦ సరసమయ్య
ఒకటివచ్చినవారి ♦ కొకటిరాగోరుట
వాలుజేసితివింక ♦ మేలటయ్య
నీపేరుదలచని ♦ పాపాత్ములకునెల్ల
తగినసంపదలివ్వ ♦ దగవటయ్య
ధనమునిచ్చియుగుణమ్ము ♦ దాచిపెట్టెదవింక
నీకేమికష్టము ♦ సోకునయ్య
గీ॥ రాకపోకలుగల్పింప ♦ రాకుమయ్య
పాకువారల మరలను ♦ సాకుమయ్య
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 92

సీ॥ భయములన్నియుదీర్చి ♦ పాలింపుమారామ
పాలింపకున్నను ♦ ప్రభువునెవడు
తాటకీసంహార ♦ దయదప్పితేయిట్లు
దయజూచువారేరి ♦ ధరణియందు
సంశయంబునుద్రెంచి ♦ సాకకుండిననన్ను
సాకువారెవ్వరీ ♦ లోకమందు
తాపంబుబోగొట్టి ♦ పాపంబువిడగొట్టి
కోపంబుజల్లార్చ ♦ నాపలేను
గీ॥ జానకీరామ జయరామ ♦ జయతురామ
కామితార్థములిచ్చెడు ♦ స్వామిరామ
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ(శ్రీ) ♦ రామరామ 93

సీ॥ ఎందులకీజన్మ ♦ మెత్తించితివో కాని
సందియంబులతోఁడి ♦ చావవలసె
ముందువెన్కలుగాన్క ♦ మోహంబులోఁబడి
మునిగిపోవుటకన్న ♦ మూలమేది
స్థిరమేదొ గానక ♦ స్థిరమునుగాంచుటే
మంచిగాదీనికి ♦ పెంచినావు
సంసారమనుపెద్ద ♦ సంద్రంబులోఁద్రోసి
యొడ్డెక్కకూర్చుంటి ♦ సడ్డఁపడక
గీ॥ నీకుమేలేమి నిటుజేయ ♦ నేటివరకు
పోటిలేదనియ నెదవ ♦ చాటువరకు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 94

సీ॥ దీనజనోద్ధార ♦ దివ్యసుందరకార
పలుమారుబిలచితిఁ ♦ భక్తపాల
నిరపరాధినియుంచు ♦ నిక్కమ్ముజెప్పగ
పగవానివలెగనక ♦ వంపుటేల
పతితపావననిన్ను ♦ సతతమ్ము స్మరియింప
హితవుజెప్పవదేల ♦ గతినిజూపి
నీవెదేవుడవని ♦ నీకాళ్ళకును మ్రొక్క
జూచిచూడనియట్లు ♦ జూచుటేల
గీ॥ నిదుదాక్షిణ్యమన్నను ♦ నేతిబీర
కాయసామెతగాబోలు ♦ గరుడగమన
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 95

సీ॥ నేఁజేయుశ్రమయింత ♦ నేటికిదెలియదా
రాజరాజులరాజ ♦ రాజవైతె
నాదుసంకల్పంబు ♦ న్యాయంబుగాదొకో
చెప్పుమున్నెపుడైన ♦ జేయువాడ
మూలంబుగానక ♦ మునిగిపోవుచునుంటి
సారంబునెఱుకక ♦ నూరకుంటి
యెటులైనను నిను జేర ♦ పటుతరమ్ముగపట్టు
చిక్కకున్నందాక ♦ చింతవిడను
గీ॥ దయయుసత్యంబు శాంతంబు ♦ ధర్మపదము
నయభయంబులబోధించి ♦ నన్ను నేలు
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 96

సీ॥ కష్టమెంతటిదైన ♦ కష్టించెదనుగాని
నినుబాయుకష్టంబు ♦ నిలుపలేను
సుఖదుఃఖములరెంటి ♦ చూచుచుండెదగాని
చూపకుండిననిన్ను ♦ చూడలేను
తోడెవ్వరునులేక ♦ నాడుచుందునుగాని
నీతోడుదప్పితే ♦ నిల్వలేను
చుట్టపక్కములెల్ల ♦ తిట్టిరోసినగాని
నీపట్టువదలియు ♦ నిలువగలన
గీ॥ కాలమొకరీతినడచిన ♦ కడకుబోను
పాలుమాలకజెప్పెను ♦ జాలిబోను
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ 97

సీ॥ మతితప్పిపోనీక ♦ మంచిమార్గమునందు
నడిపించ నెవ్వర ♦ నాథనాథ
సత్యమార్గమునందు ♦ సరణితప్పకపోవు
బుద్ధినిబుట్టించు ♦ పూర్ణమయుడ
పాపసంఘమునందు ♦ బడగబోనీకను
మనసునందునుండు ♦ మంచిస్వామి
సర్వజీవులయందు ♦ సమరసత్వమునిల్పు
జ్ఞానమిమ్మంటిని ♦ జ్ఞానదేవ
గీ॥ బాధలన్నియుమాన్పుము ♦ వనజనాథ
కన్నతండ్రివటంచును ♦ క్రమముదప్ప
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ ♦ రామరామ॥ 98

సీ॥ నీదయయుండిన ♦ నీరజగర్భుండు
పదునాల్గులోకంబుల ♦ నేలు జేసె
నీదయయుండిన ♦ బీదలందరుతిర్గ
యణిమాదిసిద్ధుల ♦ నందినారు
నీదయయుండిన ♦ నిత్యదేవతలంత
బలవంతులసురుల ♦ గెలచినారు
నీదయయుండిన ♦ మీదవానరులంత
పేరుప్రఖ్యాతికి ♦ పెరిగినారు
గీ॥ నీదుదయలేనిచోనేది ♦ నెగడబోదు
నీదయకుసాటియయినది ♦ లేదులేదు
సంతగుడిపాటి పురధామ♦సత్యకామ
రవికులాంభోధిసోమశ్రీ♦ రామరామ। 99

సీ॥ ఏకాలమున కేది ♦ యెట్లువచ్చునొ కాని
తెలియ నెవ్వరికైన ♦ కలియుగంబు
మొదలకీజన్మ ♦ యిట్లువచ్చెనొ కాని
తెలియ నెవ్వరికైన ♦ కలియుగంబు
వచ్చినతరువాయి ♦ తుచ్ఛమౌసుఖములే
తెలియ నెవ్వరికైన ♦ కలియుగంబు
పోవుటతప్పదు ♦ పొరపాటు లేకుండ
తెలియ నెవ్వరికైన ♦ కలియుగంబు

గీ॥ యుగయుగంబులనిట్టులే ♦ యుంచినావు
నగవుగాదనిచూడుము ♦ తగవుగాదు
సంతగుడిపాటిపురధామ ♦ సత్యకామ
రవికులాంభోధిసోమ శ్రీ ♦ రామరామ 100

సీ॥ నీలమేఘశరీర ♦ చాలకాలమునుంచి
వేడుచుండెటివాడ ♦ వీడబోకు
వసుధలో వాలాగ్న ♦ వంశంబు వెంకమ
రాజుకు పౌత్రుండ ♦ రాట్కులుండ
రంజిల్లు కోటమ ♦ రాజు శేషాంబకు
సుతుడనైపుట్టితి ♦ సోదరుండ
చిలకమ్మ పిచ్చమ్మ ♦ నలరామచంద్రున
కగ్రజుండను నే స♦ మగ్రముగను

గీ॥ వెంకటప్పలరాజు నా ♦ పేరువినుము
వెంకయార్యుని శిష్యుండ ♦ నింకగనుము
సంతగుడిపాటి పురధామ ♦ సత్యకామ
రవికులాంభోధి సోమ శ్రీ ♦ రామరామ॥ 101

శ్రీ

శ్రీ రామ రామ శతకము సర్వము

శ్రీ రామచంద్రున కంకితముగా సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



## కీర్తన 1

1 రామా రామా యనుమ । శ్రీరాముని పదములు గనుమ ॥శ్రీ॥
తామసగుణములు విడుమ । నిపృధస్యాశవాదము వెమనమ ॥శ్రీ॥
2 సీతారామా యనుమనా నీ । చింతలు దొలగును మనమా
అతి ప్రేమను గనుము మనమయా । నందము నొందుము మనమ ॥శ్రీ॥
3 పతితపావనయనుమ నీ । పాపము దొలగును మనమ
హితవు పైనస్థితి గనుమ యీ । తరుణము నుంచిది మనమ ॥శ్రీ॥
4 హరిహరి హరిహరి యనుమ నీ । అవగుణములు పోగనుమ
బిరబిర బిరబిర యనుమనీ । బిడియము దొలగును మనమ ॥శ్రీ॥
5 యిలమందడమున మనమ యా ॥ యినకులతిలకుని గనుమ
అలవెంకయార్యపదము నుముయి । అప్పదాసు మొరవినుమ ॥శ్రీ॥

## కీర్తన 2

1 పండరివిరలుడేడె । పుండరీకనాధుడేడె
అండజవాహనుడేడె । కొండయెత్తినధీరుడేడె ॥పండరీ॥
2 నల్లనల్లనివాడె । నామములుగలవాడె
యెల్లలోకములవాడె । యెందు వెదకిన లేడె ॥పండరీ॥
3 నవరత్నభూషణుడె । నారాయణుడె
అవగుణముల్లేనివాడె । అంతటనుండువాడె ॥పండరీ॥
4 దయచూపులువాడె । భయమెల్లబాపువాడె
ప్రియరాజ్యధాముడె । అయయొయొం వెళ్ళినాడె ॥పండరీ॥
5 కరిని నేలినవాడె । నిరుపమకారుడె
వరములొసగువాడె । మురళీప్రియలోలుడె ॥పండరీ॥

6 గోపరిపాలకుడై । తాపసవందితుడై
ఆపదోద్ధారకుడై । పాపపరిహారుడై ॥పండరీ॥
7 ధర బైటముంజులూరి । పురభక్తపోషకుడై
మరచినమరపురాడై । మందరగిరిధారుడై ॥పండరీ॥
8 అప్పదాసుని రేడై । యానందనిలయుడై
జెప్పనలవిగాడై । సిరిప్రాణనాథుడై ॥పండరీ॥

## కీర్తన 3

జయరామా సీతారామ । దయరాదా దశరథరామ
ప్రియచరితసీతారామ । అయోధ్యపట్టాభిరామ ॥జ॥
1 గజవరదా సీతారామ । కరుణాలవాల రామ
భజియించితి సీతారామ । పరిపాలన జేయవె రామ ॥జ॥
2 గౌరీనుతసీతారామ । కౌసల్యభాగ్యమరామ
కోరితిరా సీతారామ । కోపముబూనకు రఘురామ ॥జ॥
3 మునిమానస సీతారామ । మునియాగముబ్రోచిన రామ
వనవాస సీతారామ । వనచర పావన రఘురామ ॥జ॥
4 ఆలించవె సీతారామ । అప్పలదాసుని ప్రభురామ
పాలించవె సీతారామ । భవపాపవినాశనరామ ॥జ॥

## కీర్తన 4

1 పండరినాథ పండరినాథ పండరినాథ
అండనీవె యనుచునుంటి అజహరనాథా ॥జయపండరి॥
2 నిరతమునీభజన మరువ మురళీనాథ
పరమపురుష పాండురంగ । భవహరనాథా ॥జ॥

3 నిన్నేమదినన్నుతిరా । నిరుపమకార
అన్నానసనుగావరార । అఘవోద్ధార ॥జ॥

4 విఠల విఠల విఠల విఠల । విఠ్ఠలనాథ
విరోపపాల బ్రోవరా శ్రీ । విశ్వసునాథా ॥జ॥

5 మందహాసముఖ కృపా । సుందరవేషా
పాదే అప్పలదాసుని । సదా ...జా ॥జ॥

కీర్తన ౫

1 సీతారమణా రామరామ । చింతలుదీర్చవె రామరామ
మాతాపితరుడవీవెరామ । పాతకహరణా రామ ॥సీతా॥

2 సర్వజగన్మయ రామరామ । నిర్వికార శ్రీరామరామ
సర్వరక్షకారామరామ । సాధుసుశీల రామరామ ॥సీతా॥

3 నీపాదంబులు రామరామ । నిజముగనన్నుతిరామరామ
నాపాపహారరామరామ । ననుగావవేశ్రీరామరామ ॥సీతా॥

4 ఎన్నోవిధముల రామరామ । సన్నుతిజేసిన రామరామ
కన్నులకగపడవేరరామ । కరుణామృతమియరాదరామ ॥సీతా

5 అప్పలదాసునిరామరామ । నెప్పుగనేలవెరామరామ
అప్పాగావవెరామరామ । అనాదాశ్రియరామరామ ॥సీతా॥

కీర్తన ౬

విఠలె విఠలె విఠలె విఠలే । శ్రీపాండురంగ॥ విఠలెవిఠలె।
విఠలే విఠలే

1 విఠలేమురదానవారి । విఠలేశ్రీపుండరీక
విఠలే జయదేవావిఠలే । నాతుకారాం ॥విఠలె॥

2 సక్కుబాయివిఠలే విఠలే । సచ్చిదానంద ॥సక్కు
విక్కనీవెయనుచునమ్మి । చక్కగనీభజనజేసి
ముక్తిభూపాలవిఠలే । ముక్తినివిఠల ॥విఠలే॥
3 నామదేవ విఠలే విఠలే । నయనారుభక్త ॥నామ
కామజనక విఠలే । కరుణార్ద్ర హృదయవిఠలే
కామారివినుత విఠలే విఠలే ప్రేమాబాయి ॥విఠలె॥
4 కూర్మదాసవిఠలే విఠలె కులశేఖరాళ్ ॥కూర్మ॥
నిర్మలానందవిఠలే నిరుపమాకార విఠలే
కర్మబంధ హరణా విఠలే । కరిరక్షవిఠలే ॥విఠలె॥
5 గోపబాల విఠలె విఠలే । గోపికలోల ॥గోప॥
తాపస స్తోత్రి విఠలె । పాపపరిహారవిఠలె
ఆపదోద్ధారవిఠలె । అప్పదాసు విఠలె ॥విఠలె॥

కృతి 7

1 రామభజనజేయుటకభిమాన మదేల
నీమనంబు యితరులకు । నిచ్చుటయేల ॥శ్రీరామ॥
2 జన్మపరంపరల జిక్కి । చావగనేల
జన్మరహితమగుపదవికి । జడియగనేల ॥శ్రీరామ॥
3 దూషణభూషణములంచు । దూరగనేల
శేషశయను మదినిల్పక । చింతనీకేల ॥శ్రీరామ॥
4 సర్వముభగవానుడంచు । చాటవదేల
నిర్విచారమగుపదవి । నేలవదేల ॥శ్రీరామ॥
5 విషయకోరికలనుగోరి । వినుటమేల
విషయమునగనేమొతెలసి । విడువవదేల ॥శ్రీరామ॥

## కీర్తన 8

1 పాండురంగ నన్నుగావ ! భారమదేవ　శ్రీపాండురంగ
పుండరీకాక్ష నిన్నువిడువ । పతితపావన　శ్రీపాండురంగ

2 సక్కుబాయినిగాచినట్టి । సామివిగావ
మొక్కగశిక్షించనీకు ॥ ముక్తిమదేవ　శ్రీపాండురంగ

3 పుండరీకునాజ్ఞనునీ । వుండగలేద
పండరిభక్తులకెల్ల । కొండవుగాద　శ్రీపాండురంగ

4 జ్ఞానదేవునకొక్కనీవు । కరుణనునినావె
మానవాధములకునీవు । కానగరావె　శ్రీపాండురంగ

5 నామదేవ జయదేవ । నయనారుభక్తుల
ప్రేమతోడ బ్రోచినట్టి । ప్రభోనీవెగా　శ్రీపాండురంగ

6 కరిరాజునుకడతేర్చిన । ధీరవునీవెకా
నరవర నన్నాలాగున । దరిజేర్చవెరా　శ్రీపాండురంగ

7 పరమపురుషనీనామము । దురితహరణం
వరఅప్పలదాసపాల । శరణమనిన్నెనన్న　శ్రీపాండురంగ॥

## కీర్తన 9

1 అడుగడుగో శ్రీవిఠలు ఓ భక్తులార
ఓభక్తులార ఓసుజనులార　॥అడు॥

అడియేఁదాసులమన్న । విడువకబ్రోచువాడడుగడుగో
2 దిక్కునీవెయన్నట్టి దీనులనుగాచుప్రభు

చక్కగాను సక్కబాయి । చిక్కదీర్చినట్టి దేవు ॥పదు॥

3 యెంతటిపాపాత్ములైన । యేమరక గొలచిన
సంతోషమున నేలు । సామజరక్షకుం ॥డదు॥

4 భక్తజనులబ్రోవదలచి । పాండ్రాపురమందు వెలసి
ముక్తినొసగుచుండెడి । మురళీప్రియలోలుడు ॥అదు॥

5 కటిపైహస్తములుదాల్చి । ఇటుకరాతిపైనిలచి
పటుతరముగ అభయమొసగు। పార్థసారథిప్రకటముగ ॥అదు॥

6 అప్పలదాసునినేలు ॥ అజహరనాథుడు
తప్పకమనప్రార్థనవిని । యిష్టముగారక్షించుస్వామి ॥అదు॥

ఆ ర గిం పు పా ట

1 ఆరగించు శ్రీరఘురామ । అయోధ్యాపురిసీతారామ ।
సారమైనపనసతొనలు । దోరమామిడిఫలంబులు ॥ఆ

2 పచ్చికొబ్బరిపంచదార । పానక వడపప్పుద్రాక్ష
స్వచ్ఛమైననెయ్యి మీగడ । దెచ్చియుంచినారమిచట ॥ఆ।

3 బలేకమలఫలములు । బత్తాయిసీతాఫలములు
భక్తీయనేజొరుగు । పాయసంబుజేసితిమి ॥ఆ॥

4 మధురమైన చక్రపొంగలి ।మనసు దీర్పపులిహారు
సాధుదేవదధ్భోజనము । మేధాకర్పూరచక్రకేళీ ॥ఆ॥

5 వెంకటప్పలరాజపోష ॥ వేదవేద్యపరమపురుష
పంకజాక్షపాపశోష ! పాలించుభవవినాశ ఆ॥

## మంగళహారతి

1 హారతిదిగో రామశ్రీరామ జయరామరఘురామ। జయహార
మారుతివినుతవినుమురామ । మంగళంబునీకు
మమ్మేలుమపదాకు నీపాకు గతి మాకు ॥జయహార

2 శబరిఫలములందిన । జయరామమంగళంబు
చేకొనుముసంబరంబు మీకిపెవందనంబుఫలంబు ॥జయహా

3 భక్తజనులబ్రోిమెట్టి । భాగ్యమీవెగావ
పరమార్థమీవెదేవ పతితులనుబ్రోవలేవ పరభావ ॥జయ

4 జనకరాజతనయను । జేపట్టినట్టిదేవ
జగమంతనీవెగావ సతతంబుబ్రోవలేవ సమభావ ॥జయహా

5 ధారుణిముచ్చర్ల్లపుర । దాసపోషణనీమ
జయానిధేరామ ధరణిలప్పదాసుధాము తారకనామ ॥జయ

## లాలిపాట

లాలిశ్రీజయరామ । లాలిరఘురామ
పాలింపవేమమ్ము । పట్టాభిరామ ॥లాలి॥

1 భక్తపాలనజేయు । ప్రభువీవెరామ
ముక్తినొసగెడురామ । మూలమివెరామ
భక్తితోకొలచితిమి । పతితులమురామ
రక్తిగామమ్మేలు । రఘుకులోద్ధామ ॥లాలి॥

2 ఘనముగాకౌసల్య । గర్భమునబుట్టి

మునియాగమునుగాచి । ముదముంజూపెట్టి
వనరుగామునిసతికి । వాసిరాబట్టి
ధనువుగాహరువిల్లు । దునిమి జగజెట్టి ॥లాలి॥

3 సీతనువరియించి । స్త్రీపురుషులకును
ఖ్యాతిజూపించితివి । కరుణతోడుతను
నీతి లేకను కైక । నినువనములకును
మీతండ్రికిని జెప్పి। మిమ్ముబంపగను ॥లాలి॥

4 జనకునాజ్ఞనుబొంది ! జానకినిగూడి
వనవాసమునుజరుప । వైదేహితోడ
అనుజతోగలసియును । వనచరులతోడ
వనధిబాధించియును । మునిసురలుబొగడ ॥లాలి।

5 లంకేశునిదునిమి । రక్కసులగొట్టి
లంకవిభీషణుకు । రాజ్యంబుగట్టి
పొంకముగజానకిని । భూమిచేపట్టి
వెంకటప్పలరాజ । వినుతిగొన్నట్టి ॥లాలి॥



